# కమిటీకి కొన్ని సూచనలు

## యాదగిరి గుట్ట దేవాలయము

భోనగిరి తాలూకాలోని యీ దేవాలయములో శ్రీ నరసింహస్వామివారు వేంచేసియున్నారు. దీనిని ఇటీవల "రైయతు" పత్రికా సంపాదకులగు శ్రీయుత మందుముల నరసింగరావుగారు దర్శించి దేవాలయపు కమిటీవారి శ్రద్ధను కొన్ని ముఖ్యాంశముల వైపు ఆకర్షించియున్నారు: ఆ విషయములు రైయతు పత్రిక (౫-౫-౧౯౩౬)లో వెలువడినవి: వారి లేఖయొక్క తెనుగు అనువాద మీక్రింద నియ్యబడుచున్నది.

"ఇటీవల నేను యాదగిరి నరసింహస్వామి వారి దేవాలయమును ఒక వెంకన్న ఉడిసందర్భములో దర్శించుట సంభవించినది. నేనచ్చట రెండుదినములు ఉంటిని. ఇంతకుముందు కూడ ఎన్నోసార్లు నేను అచ్చటికివెళ్ళియుంటిని. కాని పూర్వముకంటె ఇప్పుడు దేవాలయము సంబంధమైన ఏర్పాటులు ఎక్కువ బాగుగానున్నవి. ముఖ్యముగా పరిశుభ్రత విషయములో ఇప్పుడు ఎక్కువశ్రద్ధ తీసుకొనుచున్నారు. ఇది ప్రశంసనీయము. యాత్రికులకొరకు కొన్ని పాయఖానాలు కట్టించినారు. ఇంకను పారిశుధ్యము విషయము బాగుపరచవలసిన అవసరమున్నది. గుట్టపైనుండి పదియిరవై గజముల దూరముకిందికి దిగువరకు దుర్వాసనవచ్చును. కనుక యాత్రికులను పాయఖానాల నుపయోగ పరచుకొనవలయునని నిర్బంధించవలెను. ఇంకను కొన్ని పాయఖానాలను కట్టించవలెను. గుట్టపైభాగమునకు హద్దు కొంత ఏర్పరచి అది "సఫాయీ హద్దు" అని నిర్ణయించవలెను. ఆట్టి హద్దులోపల యాత్రికులు పాయఖానాకు పోయిట కాలకృత్యములు నిర్వర్తించుకొనగూడదని ఆటంకపెట్టవలెను.

యాత్రికుల ఉపయోగార్థము కొన్ని నీటి నల్లాలుపెట్టించి సౌకర్యము కలిగించినారు. కాని ఇవి యింకా కొన్ని కావలయునని అనిపించుచున్నది. కనుక మరికొన్ని పెట్టించినచో యాత్రికులకు శ్రమ తప్పిపోగలదు. గుండము లో నిల్చున్నవి కాని బావిలో స్నానము చేయుటయేకాక, బట్టలు ఉతుకుటకూడ జరుగుచున్నది. బట్టలు ఉతుకుటకు ఏర్పాటు వేరే కావలెను.

పైన చెప్పిన ఏర్పాటులు చేయుటలో ద్రవ్యము ఖర్చు అగును అను మాట నిజమే. కాని శ్రీ నరసింహస్వామివారి కృపవలన దేవాలయములో ఖర్చులుపోగా ధనము మిగులుచున్నది ౧౩౪౪ ఫసలీ పూర్తియగునాటికి పూర్వపు నిలవ కలిపి ౯౩ వేలు ఆదాయము వచ్చినది. ఖర్చుల మొత్తము ౭౫ వేలు అయినందున ౧౮ వేలు మిగిలియున్నవి. సగటున నెలకు ౭౫౦౦ కు తక్కువ ఉండదు. సగటు నెలవ్యయములు ౧౫ లేక ౧౬ వందలగును. కనుక చాల ఏర్పాటులు చేయుటకు వీలుకలదు.

ఈప్రాంతములో ఎక్కడను సంస్కృత పాఠశాల, ఆభాష నభ్యసించువారికి ఏర్పాటులులేవు, అట్టి పాఠశాలయొకటి దేవాలయము పక్షమున స్థాపించుటకంటె ఉత్తమమైన వ్యయము మరేదియగును? ఒకపండితుడు కూర్చుండి టీకవేళ ఒకరిద్దరు విద్యార్థులకు చదువు చెప్పుట చాలదు. సక్రమమైన పాఠశాలయొకటి స్థాపించవలెను. అచ్చట సాహిత్యము, తర్కశాస్త్రము, మొదలగునవి నేర్పునట్టి ఏర్పాటుల చేయవలెను. కనుక ముగ్గురునలుగురు ఉపాధ్యాయు లవసరమై యుండును. ఇట్టి పండితులు దొరకుట కష్టముకాదు. వారి జీతములకు వలయుధనము మిగిలించవచ్చును. ఇట్టి ఏర్పాటులు చేసిన పక్షమున చుట్టుపట్టులలో ౫౦ మైళ్ళ దూరమువరకు విద్యార్థులు వచ్చి ఉత్తమ విజ్ఞానమునుపొందు వీలుకలుగును. వారిభోజనాదులకు సౌకర్యములకూడ సత్రములో చేయ వీలుకలదు.

ఇదికాక సంస్కృత గ్రంథములను, ఆంధ్ర గ్రంథములను చేర్చి యొకమంచి గ్రంథాలయము ఇచ్చట ఉంచుట మంచిది. దీనికికూడ ద్రవ్యము మిగిలించవచ్చును. దీనిలో యాత్రికులగువారి ఉపయోగార్థము కొన్ని పత్రికలు తెప్పించుచుండుట చాల లాభప్రదము: ఈ విషయములవైపు దేవాలయపు కమిటీవారు శ్రద్ధ వహింతురని నమ్ముచున్నాను. దేవాలయపు వ్యవస్థాపకులు (ముంతజిము) అభిప్రాయ పుస్తకము నా చేతికి నా యభిప్రాయము వ్రాయుటకై ఇచ్చినప్పుడు నేనీవిషయముల నే సూచనచేసితిని. నా యీ యభిప్రాయమును ఇతరులును బలపరతురని నమ్ముచున్నాను.



## యవజనుల చురుకుదనము

### పోతుగడ్డ వార్తలు

(విలేఖరి)

భజనసమాజము సరిగా పనిజేయుచున్నది. సోమ, శుక్రవారములు భజన రేడులో నిర్ణయింపబడినవి. గ్రంథాలయమునకు పుస్తకములు ప్రోగుచేయబడుచున్నవి. పుస్తకములకొనునిమిత్తము సుమారు రూ ౬౦ వసూలుచందాలు వసూలుచేయవలెనని తీర్మానించనైనది. ఇంతవరకు రూ ౨౦ వసూలయినవి. పత్రికలు తెప్పించు ప్రయత్నముగూడా జరుగుచున్నది. అధ్యక్షమహాశయులు ఎక్కువ ఉత్సాహముతో పనిచేయుచున్నారు. యువజనసంఘం వారందరు వారితో సహకరించి తోడ్పడుచున్నారు. బాలికల ఉన్నతపాఠశాలయొక్క మాతృభారతి కాపీలు విక్రయించబడినవి.

## హైదరాబాదు అనువంశిక ఆయుర్వేద వైద్యసభ

(స్వ. వి.)

అఖిలభారత అనువంశిక ఆయుర్వేద వైద్యమండలి (గుంటూరు) యొక్క హైదరాబాదు శాఖయొక్క ౧౦వమాసిక సమావేశము రామకోటిలో వెస్లియన్ ఆసెంబ్లీహాలులో ౩ఫిబ్రవరి ౧౯౩౭ సాయంకాలము ౬గం॥ల వేళ జరిగెను. శాఖాసంఘము యొక్క ఉపాధ్యక్షులగు వైద్యమండుల నారాయణగారు అధ్యక్షత వహించిరి.

శాఖాసంఘాధ్యక్షులగు డాక్టర్ ఎ.అర్గసు. బి. యం ౦. యస్. గారు గుంటూరు, మచిలీపట్టణములకు సంఘముయొక్క పనినిగురించి యే పోయియుండినపుడు అక్కడ తమసంఘమును మెచ్చుకొనుచుండుటవిని వట్లు తెలియజేసిరి. అక్కడివారు హైదరాబాదునవచ్చి యిక్కడ పని ఏవిధముగ జరుగుచున్నదో నేర్చుకొనుటకు కోరబడిరట.

సంఘమునకు ఉపాధ్యక్షులుగా వైద్య మండుల నారాయణ (సికింద్రాబాదు) గారే పేరు ఆమోదించబడెను.

పిమ్మట రోగనిదానమును గూర్చియు చేయి పట్టిచూచుటనుగూర్చియు ఉపన్యాసము జరుపబడెను. "నిజాం" ఆయుర్వేదిక్ ఫార్మసీ నుండియు యునానీ మహాసభతో సంబంధముగల రామకృష్ణయ్యగారు ఈ సమావేశమునకు వచ్చియుండి, అనువంశిక వైద్యసంఘము చేయుచున్న పనిని మెచ్చుకొని, నాడీ విధానమును గూర్చి ఉపన్యసించి, మున్ముందును ఇట్లతోడ్పడుచుండగలమని చెప్పిరి.

### ఆంధ్ర నిధి

శ్రీయుత గాదేపల్లి జగన్నాథము, ఆంధ్రపైప్ (ఇన్నారెన్సు) చీఫు ఏజంటుగారు ఆంధ్రమహాసభ సందర్భమున వారి దానము (౧౦) పదిరూపాయల విరాళములు కట్టుట ముట్టినవి. శ్రీ జగన్నాథరావుగారికిన్ని, ఆంధ్రపైప్ ఇన్సూరెన్సువారికిన్ని కృతజ్ఞతా వందనములు తెలుపుచున్నాము.

ఆంధ్రమహాసభా స్థాయిసంఘ కార్యదర్శి { సం. ప్రతాపరెడ్డి / మం. రామచంద్రరావు

## మిస్ లీలామణిగారికి ప్రభుత్వోద్యోగము

శ్రీమతి సరోజనినాయుడు గారి కూతురగు మిస్ లీలామణినాయుడుగారు ప్రభుత్వ విద్యాశాఖ సహాయ కార్యదర్శులుగా మూడువందల వేతనముపై నియమింపబడిరి- ద-న్యూ-

### మహాశివరాత్రి ఉత్సవము

సికింద్రాబాదు హైద్రాబాదు భక్తమండలి వారు శ్రీయోగిని అమ్మగారి అధ్యక్షతన సికింద్రాబాదు కే-ఇ-యం- ఆసుపత్రి యెదురుగానున్న పంచముఖి ఆంజనేయాలయములో మహాశివరాత్రి ఉత్సవము ౨౧-౨-౧౯౩౭ శుక్రవారమునుండి ౨౫-౨-౧౯౩౭ మంగళవారము వరకు జరిపెదరు-ప్రతిరోజు ఉదయం ౬గం॥లనుండి ౧౨గం॥ల వరకును సాయంకాలము ౭గం॥లనుండి ౧౦గం॥ వరకును పూజా పునస్కారాది కార్యక్రమముగలదు. ౨౫-౨-౩౭ నాడు దీనలకన్నదానము జరుగునట.

## ప్రకటన

ఇందువలన సమస్తజనులకు తెలియజేయుట యేమనగా, జనాబు హాజరతు వుల్లాఖాన్ వల్దు అబ్దుల్ గఫూరుఖాన్ గారివద్ద ఈ క్రింద కనుపరచిన నంబర్లు గల భూమిని నేను విక్రయించుకునినాను గాన ఈ భూముల విషయమై తాకట్టు ఉంచుకొన్న వారుగాని లేక విక్రయము పొందినవారుగాని లేక ఈఆ స్థితివిషయమై మరియేవిధమైన ఆక్షేపణగాని కలిగిన వారు ఉన్నయెడల ఈ తేదినుండి వారము రోజులలోగా నా అడ్రసుకు తెలుపుకొనవలసినది. వారము రోజులతర్వాత విక్రయపత్రాపేజు రిజస్టరు చేయించుకొనబడును గనుక తరువాతవచ్చే ఆక్షేపణలు చెల్లనేరవని ఇందుమూలముగా తెలియజేయుచున్నాను.

| సర్వేనంబరు. | య. | గుంటలు. |
|---|---|---|
| ౧౧౩ | ౧ | ౨౮ |
| ౧౧౮ | ౦ | ౧౯ |
| ౧౨౦ | ౦ | ౨౬ |

బేగంపేటలో జనాబు విక్రాపుల్ ఫ్రమా సాహ ఇలాకా హాయగావా స్థలములయొక్క లైనులో

ఇట్లు,
సి. రామచంద్ర పిళ్ళె,
౧౪౫ అర్సుబ్రాహ్మణస్ట్రీటు.
సికింద్రాబాదు.

ఆంధ్రులకు
౨౦ లక్షల నిజాం
రాష్ట్రాంధ్రుల అభి-
వృద్ధికి ముఖ్యసాధనము
గోలకొండ పత్రిక

# గోలకొండపత్రిక
# GOLKONDA PATRIKA
HYDERABAD-DECCAN
The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper
for H E H The Nizam's Dominions

వర్తకులకు
నిజాం రాష్ట్రము నిండియున్న
జిల్లాలలోని ఆంధ్రుల
తో వ్యాపారవృద్ధికి
సాధనము! గోలకొండ
పత్రికలో ప్రకటనము

Vol. 10. | Monday 17—2—1936 | No. 78

## తిరస్కరణీ విద్య

### సర్వవస్తువులను స్ఫటికముచేయగల కిరణాలు

ఒకగది అదిఅంత పెద్దదికాదు అంత చిన్నదికాదు అందులో ఒక చిన్న వేదిక అది అప్పటికప్పుడే వేయించబడినది ఆవేదిక అర్ధచంద్రాకారముగలిగి యుండెను దాని చుట్టును మేము కూర్చొనియుంటిమి ఎక్కడనో ఒక యలెక్ట్రిక్ డైనమో ఝుమ్మనుచుండెను అంతకుదప్ప మరేదియు శబ్దములేదు ఆ వేదికపై ఒక స్త్రీ నిలుచుండియుండెను ఆమె వెనుక ఒక కొయ్యచట్టము పెట్టబడియుండెను దానిలో కొన్ని పగుళ్లు కండ్లకగపించుచుండెను

ఎవరో మాట్లాడినట్లు "చూడండి ఆ హీరాకారము ఏవిధముగా అంతకంతకు సన్నబారుచున్నదో "

వెంటనే ఒక ఆశ్చర్యము కనపడెను ఆస్త్రీయొక్క ఆకృతి మొదట ఉన్నంతపరిమాణములోనుండక క్రమక్రమముగ సన్నగిల్ల నారంభించెను కాని ఆకారము ఇంకను కంటికి కనబడుచునే యుండెను అయినను ఆ స్త్రీ అదృశ్యమగుచున్నదని మాకువారిలకు తోచుచుండెను ఇంతలో మేము ఆ స్త్రీయొక్క తలవైపు దృష్టి ప్రసారించితిమి ఇదేమున్నది సరిగా తలవెనుకభాగమునసుండు చెక్కబోర్డు భాగములోని పగుళ్లు కనుపించుచుండెను ఆస్త్రీ ఏమో ఇంకను ఆకొయ్యచట్టమునకు ముందె —— ఏదో దయ్యమువలె — నిలచియుండెను అంతే ఆదే ఆ స్త్రీదర్శనమునకు ఆఖరు మరల ఆ స్త్రీ కనుపించలేదు ఆ కొయ్యల చట్టము మాత్రమే నిలచి యుండెను ఆ స్త్రీని తాకవచ్చును ఆమె మాట్లాడునపుడు మాటవినవచ్చును కాని ఆమె కనపడదు బహుశా ఆమె గాజు పదార్థముయొక్క తత్వమును పొందినదని చెప్పవచ్చును గాజు అద్దములోగుండా ఇతరవస్తువులను చూడవచ్చును కదా'

* * *

ఈ విచిత్ర రహస్యమును కనిపెట్టినవాడు ఇంతలోగా ప్రక్కగదినుండివచ్చెను కనిపెట్టినది అతడే ఆ యంత్రమును ఆడించినదిఅతడే, అప్పుడు మాట్లాడినది అతడే ఇప్పటికింకను అతనికి ౨౫ ఏండ్లునిండలేదు విశ్వవిద్యాలయపుగ్రాడ్యుయేటు అతనివృత్తి ఇట్టిక్రొత్తరహస్యములను కనుగొనుట ఇది అతడు తననుగూర్చి చెప్పిన విషయములు.

ఇతని పేరు జోసఫ్ ప్రిబిల్ ఇతనితండ్రి హంగరీ దేశములో ఒకప్రభుత్వాధికారి ఇట్లు ప్రిబిల్ గొప్పవంశములో పుట్టినవాడు

"మంత్రినీపనిఏమో చెప్పవూ, ప్రిబిల్ ? " ప్రిబిల్ ఇట్లుచెప్పెను "నాకు ఏవిధముగాలేని అవిధముగా కనిపింపజేయగల ఫిలిము చేయవలెనని చాలకుతూహలముగా నుండెడిది ఇప్పుడు అట్టి ఫిలిం కళావేత్తలకును శాస్త్రజ్ఞులకును గొప్ప సమస్య నేను పరిశోధించుచుండినప్పుడు నేనేవో కొన్ని కిరణములను చూచియుంటిని దానినిబట్టి నా మొదటి యంత్రమును ౧౮ నెలల క్రింద నిర్మించితిని అది చాల చిన్నది అంత మంచిదికూడా కాదు ఒకఏడాది క్రింద నేను రెండవ యంత్రము చేసితిని పోయినకొంది మాసములనుండి నేను నా మూడవయంత్రముతో పనిచేయుచుంటిని ఇదేల ? మొన్న మొన్నటివరకుకూడా నేను కనిపెట్టిన కిరణములతో మంచి సూర్యుని వెలుగు నుష్యానికి చేతులు లేవు ! అతని చొక్కా చే లో ఏమియు చేయలేకుంటిని అయితే ఇప్పుడు నేను పూర్తిగా గాలిసొరుబోట మంచిన సన్నని అల్యూమినియం రేకును మాయము చేయగలను నిజం ! " ఒక చిరునవ్వు, "నేనువస్తువులను మాయము చేయను వాటికి స్ఫటికతత్వమునిత్తును అంతే "

" ఆకిరణములవల్ల ఏవస్తువైనను స్ఫటికము వలెనగునా ?

హెర్ ప్రిబిల్ తలయూచెను "అగును

అయితే నేనొక అంజనము తయారు చేసియున్నాను దానిలోగుండా కిరణములు ప్రసరించనే ప్రసరించజాలవు దానినుపయోగించి నేను కొన్ని వస్తువులు కనపడునప్పుడుకొన్నింటిని మాత్రము కనపడకుండచేయగలను

* * *

మరల హెర్ జోసఫ్ ప్రిబిల్ తన యంత్రముకడకు పోయెను ఈ సారి అతడు మొట్టమొదటచేసియుండిన యంత్రముయొక్క స్విచ్చును నొక్కెను వేదికపై ఆకుపచ్చరంగు పూతగల ఒక బొమ్మకుర్చీయుండెను కుర్చీలో నొక బొమ్మ ఆబొమ్మ చేతుల మణికట్లుకు కొన్ని లోహపు కడియములు వైనమో పని ప్రారంభించెను—కిరణములు ప్రసరించసాగెను —కుర్చీలో ఏమియులేదు బొమ్మ అదృశ్యమైనది కాని కుర్చీయు, లోహపు కడియములును ఇంకను అక్కడ కనబడుచున్నవి

మరల అదే విచిత్రదృశ్యము బొమ్మ ఆకృతి క్రమక్రమముగా సన్నగిల్లుచు తుదకు అదృశ్యముకాగా బొమ్మవెనుకనుండిన చెక్క సందులు, పగుళ్లు కనబడుచుండెను ఈ సందులు పగుళ్లు మొదట స్పష్టముగా కనపడలేదు కాని క్రమక్రమముగా స్పష్టదృశ్యము లయ్యెను

ఇంకొక ప్రయోగము (యక్స్పెరిమెంట్) వేదికపై ఒక బొమ్మ కుర్చీమాత్రమేయుండును దానికి మంచి ఆకుపచ్చ రంగుపూత చూడవచ్చినవారిలో ఒకడు కుర్చీ వెనుకనుండి తనరెండుచేతులను ముందుకు చాచియుండెను ఆతని చేతులు పెద్దవి ఆ చిన్న కుర్చీపై చక్కగా కనపడుచుండెను యంత్రము పనిచేయ ప్రారంభించెను చేతుల ఆకారము క్రమక్రమముగా మాసిపోవుచుండ కుర్చీఆకారముఅంతకంతకు స్పష్టముగా కనపడసాగెను ఆ కుర్చీకిముందు రెండుచేతులును దయ్యమువలె కనిపించుచుండెను కుర్చీచక్కగా ఆకుపచ్చగా కనిపించుచుండెను మేము గోళ్లలోగుండా చూచుచుండగా చేతి ఎముకలు, కండలు కనపడుచుండెను ఆ చెక్కలోని సందులును, కుర్చీ ఆకారమున్నచోట అగోళ్ళగుండా కనబడుచుండెను ప్రేక్షకులలోనుండి ఒక స్త్రీయొక్క ఆశ్చర్య వినబడెను కుర్చీవానికనున్న మనుష్యానికి చేతులు లేవు ! అతని చొక్కా చేతులు ముగియుచోట గాలితప్ప మరేదియు లేదు కాని ఈఉత్తరకోటు కుర్చీని అందుకొనుచు పనిచేయును, చేతులచటనే ఉన్నవి కాని అనిమనకు కనపడుటలేదు

హెర్ ప్రిబిల్ ఇదియొక సామాన్యవిషయమని భావించును "ఎందుకనగా కిరణములు ఒకదానితో నొకటి కలిసి ప్రతిఫలించునప్పుడు మాత్రమే వస్తువులు కనపడును కిరణములు అ ప్రతిఫలదశను దాటినచో దృశ్యము మారి, అవస్తువు ఇక నెంతమాత్రము కనబడకుండ పోవును "

"ఈ కిరణములు చాల ముఖ్యములు ఇది ఊహించుము నీవు ఇంటికి పోలేవనుకొనుము ఇంటిలో ఏమియు కనపడదు-కాని నలుగురైదుగురు మనుష్యులు స్ఫటికాకారులు ఒకరొకరితో మాట్లాడుచుందురు పోనీ అదికాదు ఇంకొకటి-ఏదని చెప్పను' ఈవిధముగా ఎన్నెన్నియో ఊహించవచ్చును ఇప్పుడేచిత్రము మొన్న మొన్ననే క్రొత్తగా కనిపెట్టబడినదైనను, ఈప్రపంచము యావత్తులో మనజీవితములనే పూర్తిగా మార్చివేయవచ్చును "

మాకు సందేహము

"ఏదియు అసాధ్యము కాదు కాని ఇంకను కొవలసినంతకాల మున్నది "

ఇంతలో ఒక పెద్దమనిషి అందును నవ్వుచు వచ్చినవాడు అనెను "మీకునమ్మకము లేదా? అందరును ఈవిషయములను గూర్చి మాట్లాడుచున్నారు ౧౦ఏండ్లకాలములో అదృశ్యజీవములను ఈ ప్రపంచమునచూడలేమని మీరలు చెప్పగలరు?"

ఇదినిజమేనాయని మేము హెర్ ప్రిబిల్ను అడుగగా అతడు అదివట్టిమాట యనెను

"నామట్టుకు నాకు ఈకిరణములకుంగల అంత ప్రధానముకాదు నాకుముఖ్యమైనదికొన్ని వస్తువులను కనబడకుండ చేయుటకై అంజనము ఈఅంజనము పైజెప్పిన కిరణములకు విరుద్ధముగా పనిచేయునని నేను కనుగొంటిని అది నా ముఖ్యవిషయము "

"ఈయంత్రమును అంతకంతకు బాగుచేసి, భవిష్యత్తులో దానిసహాయముతో సేనలు, తుపాకులు, విమానములు మున్నగునవి కనపడకుండ పని చేయవచ్చునని మీరూహించరా?"

హెర్ ప్రిబిల్ గారికి సందేహము "నాకది నమ్మకము లేదు కాని కొన్ని విశేషములు గలవు వాటిని నేనిప్పుడు చూపించజాలను అవి రహస్యములు కాని ఈ యంత్రము యొక్క ఉపయోగములను గూర్చి బ్రహ్మాండముగా చెప్పజాలను "

* * *

ఆయంత్రముయొక్క భవిష్యత్తును గురించి మాట్లాడబోచ్చితిమి హెర్ ప్రిబిల్ చాల ఆత్రముతో యిట్లుచెప్పెను

"అవును నేను నాక్రొత్తయంత్రమును పూర్తిచేసినతర్వాత నేను దానిశక్తిని ప్రదర్శించుటకై ప్రపంచ సంచారము చేసెదను నాకప్పుడే స్పెయిను ఇంగ్లాండు ఫ్రాన్సు అమెరికాలనుండి లేఖలువచ్చినవి నేను దీనిపేటెంటును అమ్మను విషయములో ఏదియు అనుకొనలేదు. నేను కొన్నివేల యంత్రములను తయారు చేసి వాటిని అద్దెకిచ్చెదను. భవిష్యత్తును గూర్చి ప్రకటనచేయవలెనని నా ఉద్దేశ్యము "

ఆభవిష్యత్ప్రకటన ఆశ్చర్యమే

"ఒకఉదాహరణము ఒకరేసింగ్ కారున్నది మోటారు లేక్కన ముఖ్య భాగములకు పైజెప్పిన విచిత్రాంజనపుపూత ఉన్నది (అదియెట్టి ఉపద్రవమునుగాని చేయదు ) ఆకారును అందరికి ప్రదర్శనము చేయుచున్నారు నాకిరణములు దానిపై ప్రసరింప జేయబడునను కొనుము అప్పుడు వెంటనే హఠాత్ అదృశ్యమగును దాని నీ మాయమగును యంజను తప్ప మరేదియు కనపడదు యంజనుయొక్క అన్ని భాగములును స్పష్టముగాకనబడుచుండును అయంజను గాలిమధ్యలో వ్రేలాడుచున్నట్లుండును

"ఇట్లే ఒకఓడనుగూర్చి ఆలోచింతము ఉన్నట్లుండి ఆఓడయొక్క స్థూలభాగమంతయుమాయమగును అందులోకేబిన్లు, యంత్రభాగము, లోపలిఏర్పాట్లు మున్నగునవన్నియు ఒక్కొక్కటికూడ పోకుండాకనపడును "

హెర్ ప్రిబిల్ సంతోషస్వాంతుడై యుండెను "ఇకమీద ఏవస్తువునుగాని చక్కగా చూడకుండా కొనవలసిన అవసరముండదు కారుయొక్క యంజినును, ముఖ్యభాగములను విప్పకుండనే చూడవీలగును ఏదైన తప్పుగానున్నచో ఈకిరణములను ప్రసరింపజేసి లోపల చూడవచ్చును ఇది నేనిప్పుడు పరీక్షించుచున్న విషయము

"డాక్టరు రోగినియక్స్రేతో పరీక్షించినట్లే నేనికముందు కారునుపరీక్షించగలను

దానివలన లాభమేమో తెలియునా? దానిచే యంజినుచెడినందువల్ల కలుగుఉపద్రవములు కలుగకుండనిలిచిపోవును అదిసాధ్యము లేకపోవు ఎందుకనగా, ఎప్పుడనిన అప్పుడు మనము ఏదిచెడినదో చక్కగాచూచి సరిచేసికొనవచ్చును కారు అప్పుడు తప్పక మంచిస్థితిలో లొంగియుండును "

ఇదిగొప్పవిషయమే

ప్రదర్శనము జరుగుచువేయున్నది ఇప్పుడు గదిలోకొందరు అమేరికాదేశీయులును, కొందరు ఆంగ్లేయులును గలరు మొదటవారికి నమ్మకము లేకుండును కానివారిప్పుడు మెచ్చుకొనుచున్నారు

ఇదంతయు ఒక పెద్దకలవలె నున్నది మనము స్ఫటిక పదార్థములోగుండా చూచినట్లు స్త్రీ శరీరముగుండా చూడగలము, [illegible] యంజను చూడగలము ఇంకను—— ఇంకను తెలియని ఊహాతీతములైనస్థితిలో ప్రభావితకరములు

ఇలస్ట్రేటెడ్ [illegible]

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad. Editor K Balakrishna Reddy.